Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ సెప్టంబరు నెల 4 వ తేది శుక్రవారం [నె 35 రు.

## అంకితం.

నేటితో యుద్ధం నాలుగో యేడు ప్రారంభమగుచున్నది. ఈ యేడే ఆఖరు ఏడాది అను కుంటాం. ఈ నాల్గవ వర్షప్రారంభ దినమున వెలువడు యీ ప్రత్యేక యుద్ధ సంచికను, ప్రపంచ యువకులకు, ముఖ్యంగా యీ పటంలోనున్న యువకునకు అంకితం చేయుచున్నాము.



బ్రిటిషు ప్రధాని చర్చిల్‌గారి మనుమడు విన్స్టను చర్చిలు.

# సివిలు ప్రజలు ధైర్యంగావుంటే గెలుపు.

## (సర్ రాబర్టు డెనిస్టనుగారు.)

తరుముకోవస్తున్న శత్రు సైన్యాలను ఎదిరించ గలరాయని మార్షలు ఫోచ్‌గారిని (గత యూరోపు మహా సంగ్రామమునందు మిత్రమండలి సేనా నాయకుని) ప్రశ్నింపగా "సివిలు ప్రజలు ధైర్యంగా వుంటే శత్రువుని నిరోధించగలను" అని చెప్పెను. గత యుద్ధంలోనే సివిలు ప్రజల ధైర్యం గెలుపుకి యింత అవసరంవున్నప్పుడు యీ యుద్ధంలో యింకా ఎంత, యెక్కువగా అవ సరముండాలి. 1914 వ సంవత్సరములో జర్మనులు యిపుడు వృద్ధిచేసినంతగా ప్రచార పద్ధ తులు వృద్ధిచేయలేదు. అప్పుడు అరక్షితమగు నగరాలపైవిమానాలనుండి బాంబులువేయుట ఎరు గరు. ఇటలీలో "సత్యప్రతిబింబం" అను పత్రికకు దేశీయాంతర్గత అరాచకంతోనే కాలంగడచిపో యేది. అప్పుడు యిప్పటివలె టోకియో రేడియో ఎల్లవేళల నాగుపామువలె బుసగొట్టుటలేదు. రేడియో సృష్టింపబడుటచే యిపుడు సివిలు ప్రజ లకుగూడ సిపాయికివచ్చినంత ప్రాముఖ్యతవచ్చి నది. యుద్ధ విజయానికి వారి శక్తియెంత అవ సరమో వీరి ధైర్యం అంత అవసరమైనది.

ఇంగ్లాండు తమదేశపు విమానదళమునకు ఎంత ఋణపడియున్నదో చర్చిలు ప్రధాని తెలిపి యుండెను. మన దేశంలో మనం మన సిపాయి లకు ఎంత ఋణపడియున్నామో ఎన్నడైన ఆలో చించుచున్నామా ? యుద్ధంచేసి ఇండియాకొరకు అవసరమయితే ప్రాణత్యాగం చేయడం మంచి దా లేక రాజకీయదుర్ధతో రైల్వే పట్టాలు లా గేసి పోస్టాఫీసులు కాల్చేసి, శత్రువు తరుముకో వస్తున్నప్పుడు మార్గాలులేకుండా చేయటం మంచిదా ? భారతీయ సిపాయిలు మంచిపని చేయుచున్నారు. వారికి మనం సహాయపడు టెట్లు ? సివిలు ప్రజల ధైర్యం వృద్ధిచేసి, వెనుక దన్నుగానుండుటే మంచి సహాయమార్గము. బెర్లిను, రోము, టోకియో నగరాలందు రేడియో స్థానాలనుండి సర్వదా అసత్యప్రచారం చేయుచు వాతావరణం పాడుచేయునటువంటి పాపం మనం చేయలేదు కావున, మనం యుద్ధకార్యాలందు యీ ప్రచార శాఖయందు మాత్రమే శత్రువుకన్న వెనుకబడియున్నామని చెప్పవచ్చును. కాని యీ దేశంలో సివిలు (సామాన్య) ప్రజల ధైర్యం చెడకుండా యుంచుటకై జాతీయ యుద్ధరంగం ఒకటి యేర్పాటుచేయబడినది. అందులో చేరు టకు మీరు యీదిగువ సభ్యత్వపు ఆదర్శమును కలిగియుండవలెను :—

> "నేను ఇండియావాడనని గర్వించుచుండుటచేత, భీతిని భయము కలిగించువదంతులను రూపుమాపుటకును; భారత జాతీయ గౌరవము భద్రతలకు ముప్పువాటిల్లచేయు సంఘటలన్నిటి నెదిరించుటకును ; తప్పక విజయము పొందెదమను నమ్మకం గాఢంగాకలిగి అనుదినము పాటుబడుదును"

ఈ సంకల్పము నచ్చనివారు యీ మహానా డులో ఎవ్వరయిన నుండగలరా ? ఉన్నట్లే యుంది ! యుద్ధ ప్రయత్నాలకు విరోధం కల్గిం చుటే తమదేశాభిమానమని ఎంచువారు పెక్కం డ్రు, ఇండియాలోనుండుటచేత, సదుద్దేశంగల వారందరిపై దానికి విరుగుడు యోచింపవలసిన బాధ్యత ఎక్కువగగలదు. కావున జాతీయ యుద్ధరంగంలో చేరండి. అందుచేరిన ప్రతి సభ్యుడును ప్రచారకుడుగనుండి, భీరువులయిన వారిని ధైర్యవంతులుగచేసి, అనుమానించుచున్న వారికి నమ్మకంకలిగించి, వదంతులు వ్యాపించు వారిని ఖండించి, బుద్ధిపూర్వకంగా అబద్ధాలు చెప్పువారికి తగిన జబాబుచెప్పి, మీ సిపాయిల గూర్చి గర్వించి, చివరవిజయం మనదేయను ఆత్మవిశ్వాసం పూర్తిగ కల్గియున్నచో, మీవిధి మీరు నెరవేర్చిన వారగుదురు.

# నాల్గో యేడు యుద్ధం.

## గవర్నరు సర్ ఆర్థర్ హోప్‌గారి సందేశం.

మదరాసు గవర్నరుగారు యుద్ధసంచికకు ప్రత్యేకంగా యీ దిగువ సందేశం పంపిరి :—

సెప్టంబరు 3 వ తేదిన ప్రపంచమంతా ఆక్రమించిన యీ యుద్ధంయొక్క నాల్గో యేడు ప్రారంభమగును. యుద్ధం చాల తీవ్రంగా జరిగింది. అక్షరాజ్యాలు దురాక్రమణ ఉద్రేకంలో మనతోబాటు మహా శక్తివంతములగు రష్యా, అమెరికాలపైగూడ కత్తిగట్టి పోరులో దిగినవి. అయినను, చర్చిలుగారు యిదివరకు హెచ్చరించినట్లు, 1942 వ సంవత్సరములో ఆత్మ రక్షణకొరకే యుద్ధం జరుగునని మనమెరుంగుదుము. కొద్ది విజయాలతోబాటు ఓటమిలుగూడ సంభవించెను. ఏమన, అక్షరాజ్యాలు శాంతి సమయంలోనే పెంచుకున్న శక్తిని, శాంతి యుతమగు రాజ్యాలను మోసంచేసి ఆక్రమించి తరువాత సంపాదించిన అదనపు శక్తినిగూడ మనం ఎదుర్కొనవలసియుండెను. అక్షరాజ్యాలు తయారుచేయు సైన్యాలను, కూడదీయు శక్తులనుగూడ మించగల అంగబలం అర్థబలంకూడ సంపాదించి, చివరకు విజయం పొందగల మనుటకు ఎట్టి సందేహం లేదు. ఆ శక్తి క్రమేణ చేకూరుచున్నది. డిపీ రేవుపై దాడి దానికి ప్రథమ సూచన. 1943 లో 1918 వలెనే యుద్ధగతి అటుంచిటు తిరిగిపోగలదు. కాని, యింకా కష్టకాలం కొంత ముందుంది. కావున, స్వాతంత్ర్యం కొరకు న్యాయం కొరకు అందరు కలిసికట్టుగ నడుంబిగించి పనిచేయాలి, యుద్ధకృషికి శక్తికొలది తోడ్పడాలి. అట్లా చేయనివారు దేశాభిమానులు కారు, దేశద్రోహులు.

ప్రస్తుతం దేశంలో చెలరేగుచున్న దౌర్జన్య చర్యలు దేశ స్వేచ్ఛకు ప్రమాదకరములై జపాను దాడిని ఆకర్షించును. ఇండియా శత్రువులకు తప్ప యింకెవ్వరికి దీనివలన లాభ ముండదు. దేశంలో శాంతి కాపాడుటకు ధైర్యంగా రాజభక్తితో పాటుబడుచున్న మేజస్ట్రేటులు, పోలీసువారునుకూడ యుద్ధరంగమున బహిర్ శత్రువులను వారించుటకు పోరాడుచున్న సిపాయిలు, వైమానికులు, నావికులు ఎంత దేశాభిమానంతో సేవచేయుచున్నారో అంత సేవ చేయుచున్నట్లే.

అక్షరాజ్యాలు విజయమొందినచో యీ దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సున్నయగుటే గాక, ఉన్నత విద్య, న్యాయస్థానములలో న్యాయము, మతసహనము పూర్తిగ పోయి, ఇండియా ఎన్నడెరుగని అనాగరిక స్థితికి వచ్చును. అట్లా గాక, యుద్ధం చేయుచున్న సైన్యాలకు తోడుగ భారతీయులు నిలిచి దేశీయాంతర్గత వైషమ్యములు మానినచో, సంయుక్త రాజ్యాలు విజయమొంది, ప్రపంచ స్వాతంత్ర్య జాతులలో తనను మించగలచినది వేరొకటి లేదని ఇండియా అనిపించుకోగలదు.

# యుద్ధంవలన ఇండియాకు కలిగిన మేలు.

## పంటలు, పరిశ్రమలు వృద్ధియగుట.

యుద్ధం అనేకమందిని చంపి, ఆస్తులను పోగొట్టుటేకాక, ఆర్థిక విధానమును జీవిత పద్ధతులను తారుమారుచేయునట్టి చెడుగనుటకు ఎట్టి సందేహం లేదు. అయినను అందులోనూ మేలు లేకపోలేదు. ఒక మూల వస్తునాశనం జరుగుచుండగనే, యింకోవైపు నిజంగా మేలు జరుగుచుండుట బాగా యోచించినవారు తెలుసుకోగలరు.

భారతదేశంలో ముఖ్యంగా, వ్యవసాయం ఎక్కువ. జనసంఖ్యలో ఎక్కువమంది చిన్న చిన్న భూస్వాములు, వ్యవసాయపు పనులు చేసుకొనే కృషీవళులును. యుద్ధానికి పూర్వం ఇండియాలో ఎంత కావాలో అంత పంటలేక, ముఖ్యంగా బియ్యం బర్మానుండి దిగుమతి జరిగేది. సునాయాసంగా వస్తూవుండబట్టి, తన సంపద నభివృద్ధి చేసుకొనుటకు అపుడు పాటుబడలేదు. కాని, యిపుడు స్వయం పోషకంగా నుండక తప్పదు. తనకు కావలసిన పంట పూర్తిగా తానే పండించుకోడం కాకుండా, సింహళం మున్నగు దేశాలకు ఎగుమతి చేసువలసియున్నది. అందుకే "పంట లెక్కువ పండించండి" అను ప్రచారోద్యమం ప్రారంభించబడినది. ఈ ప్రచారం బాగా ఫలించుచున్నది. అదివరకు నాగలి, సాగు అంటే యేమిటో ఎరుగనివారు యిపుడు వరి ధాన్యం, కాయగూరలు, పండ్లు కాయధాన్యాలు ఎక్కువ పండించుచున్నారు. సాగుచేయదగ్గ ప్రతి అంగుళం మేర విడచిపెట్టకుండ సాగుచేయబడుచున్నది. కావున యీ యుద్ధ ఫలితంగా, కలిగిన మొదటి మేలేమంటే, ఇండియా స్వయం సమృద్ధి యగుట నేర్చుకొనుచున్నది. యుద్ధానంతరం, ధరలు పడిపోయినాగూడా, యీ స్వయం సమృద్ధి కార్యమెందుకు కొనసాగరాదు? అందుకు తగిన టారిఫ్ (సుంకముల) యేర్పాటులు చేయబడగలవు.

### ధరలు పెరుగుట గొప్ప నష్టం కాదు.

వస్తువుల ధరలు పెరిగినవని గోలగవుంది. నెల జీతాలవారికి యిందువల్ల కష్టంగానే యుండును. కాని జనసంఖ్యలో ఎక్కువమంది తాము తినవలసినవి తామే పండించుకుంటూవుంటే, వస్తువికి వస్తువే పట్టాయించుకుంటూ వుంటే, పండించే పంటలకు యిదివరకుకంటే ఎక్కువే వచ్చును; కావున ధరలు పెరుగుట వలన అంత బాధగ నుండదు. 1938 నుండి వ్యవసాయదారులకు వారు పండించు పంటలకై 65 కోట్లు రూపాయలు చెల్లింపబడుచుండేది. ఇందులో కొంతభాగం, మధ్య వ్యాపారస్తుల లాభాలక్రింద పోతూవున్నా, అందులో కొంతైనా రయితుల జీవిత వ్యయం వృద్ధిచేయుటకు తోడ్పడియుండును. కావున చిట్టచివరకు రయితులకు లాభమేగాని నష్టముండదు.

భారతదేశంలో పరిశ్రమలకన్న వ్యవసాయమే యెక్కువగ అభివృద్ధి చెందుచున్నదంటారు. కాని యుద్ధంవలన పరిశ్రమ లన్నింటికిని, ముఖ్యంగా యుద్ధానికి తోడ్పడు పరిశ్రమలకు యెక్కువ ప్రోత్సాహం కలిగెను. ఇది దేశానికి స్థిరమగు మేలు చేయగలదు. చెన్న రాష్ట్రంలో ఫ్యాక్టరీలయందు కార్మికులు 1939 లో 197,000 మంది యుండిరి; 1941 లో 234,000. అదివరకీ దేశంలో తయారు కానటువంటి వస్తువులెన్నో యిపు డీ దేశంలో తయారగుచున్నవి. నేర్పరులగు పనివారి సంఖ్య యెక్కువగుచున్నది. ప్రత్యేక వృత్తులందు శిక్షణపొంది "బెవినుబాయిసు" ఇంగ్లాండు పోయి వస్తున్నారు. సప్లయి శాఖవారు అంతకంతకు మరీ యెక్కువగ, గృహ పరిశ్రమల సరకే కొంటున్నారు. చేమగ్గముల పరిశ్రమ యుద్ధంవలన చాల లాభం పొందినది.

దేశంలో నిరుద్యోగుల సంఖ్యాగూడ ప్రస్తుతం తగ్గిపోయింది. సైన్యంలో దిగువ తరగతుల వారే గాక, మధ్య తరగతివారు, గౌరవ కుటుంబాలవారుగూడ ఎక్కువగ చేరుచున్నారు. అదివరకు ఉద్యోగాలు లేక అల్లాడుచుండిన వారెందరికో యిపుడు ఉద్యోగాలు దొరికినవి.

### అజ్ఞానం తొలగింది.

యుద్ధానికి పోయివచ్చిన సిపాయిలు, తమ స్వగ్రామాలలో తమ అనుభవాలను తెలిపి,



స్కాటులండులో ఉక్కు కర్మాగారములందు స్త్రీలు పనిచేయుచు, టాంకులకు నౌకలకు ఉక్కు రేకులు తయారు చేయుచున్నారు.

గ్రామస్థుల అజ్ఞానం తొలగించి, యుద్ధభీతిని పోగొట్టిరి. వారు యితర దేశీయులతోను జాతీయులతోను సంపర్కంవలన గడించిన ఔదార్యం సాహసం, సానుభూతి, ధైర్య గుణములు భారత జాతి కెంతో మేలు చేయగలవు.

సైన్యంలో చేరినవారుగాక సివిలు పయనీరు దళములో కొందరు చేరిరి. మదరాసులో 1,200 చొప్పున రెండు యూనిటులు, చేర్చుకొనబడుచున్నవి. స్త్రీల ఆగ్జలరీ దళము, సివికు గార్డ్సు, జాతీయ యుద్ధరంగదళము, స్వార్థ త్యాగంతో పనిచేయు రెడ్ర్కాసు జట్టు, యివన్ని ఉన్నాయి. ఇటువంటి సేవా సంస్థలన్నియు దేశంలో నైతిక ధైర్యోత్సాహములను పెంపొందించక మానవు.

ఎ.ఆర్.పి. దళంలో వేలకొలది వార్డనులు, మంటలార్పువారు, ప్రథమ చికిత్సచేయువారు, ఐచ్ఛిక భటులు శిక్షణ యొసంగబడుచున్నారు. ఇందులో ఎంతో సివికు బాధ్యత యిమిడియున్నది. ప్రజా ధర్మం బాగుగ గుర్తింపబడుచున్న దనుటకు సహకారోద్యమమొక సాక్షి. సహకార ఋణసంఘములు, విక్రయ సంఘాలు, నేతవాండ్ర సంఘాలు మున్నగునవి ఎంతోవడిగ పెరిగినవి.

యుద్ధంవలన ఉన్నచెడుగు అటుండగా, యిన్ని రకాల మేళ్లు చేకూరుట చాల ఆశ్చర్యంగా నుండును. ఆర్థికంగాచూచినా, వైజ్ఞానికంగా చూచినా ఇండియాకు ఉత్తరోత్రియా లాభమే కలుగును. యుద్ధానంతరం పునరుద్ధరణ కార్యం నేర్పుతో ఔదార్యంతో జరిగినచో భారతదేశం నైతికంగాను, భౌతికంగాను చాల ఉన్నత స్థితికి రాగలదు.

# జాతీయ యుద్ధరంగము

## కొన్ని సంకోచములు.

ప్రపంచ యుద్ధం ప్రబలియుండ, రాజకీయ తుపాను చెలరేగుచుండ ఉద్భవించిన జాతీయ యుద్ధరంగం ఉద్యమం యిప్పటికి దేశంలో కాలూనింది; రాజకీయములందు యికముందు చురుకుగ పనిచేయగలదు.

పత్రికలలో వ్యాసాలు, ఉపన్యాసాలు, గోడలపై ప్రకటనలు, కర పత్రాలు జాతీయ యుద్ధరంగం ఉద్దేశాలను చాటుచున్నవి. అది ప్రధానంగా రాజకీయేతర సంఘమని ప్రకటించబడెను. నిజంగా జాతీయ యుద్యమమగు దీని జాతీయతపై యిపుడందరి కళ్లపడినవి. ఏమన దేశంలో అతిపెద్ద రాజకీయ సంస్థ దీనిని మొదటినుండి ద్వేషించింది; యిపుడా పార్టీవారు యీ సంఘం తమపై బాహాటంగా దౌడుతీయుచున్నందుకు పక్షపాతమంట గట్టుచున్నారు.

జాతీయ యుద్ధరంగం సత్వరంగా సాధించదలచిన లక్ష్యమేదో ముందు చెప్తాంగాని, యీలోగా జూలై 14 వ తేదీన కాంగ్రెసు వర్ధా తీర్మానం గావించిన పిమ్మట యీ ఫ్రంటు వైఖరిని ముందుగా సమర్థించుకోడం మంచిది. ఈ జాతీయ యుద్ధరంగం స్థాపించబడిన కొన్ని నెలలవరకు, శత్రుదాడి నిరోధించడానికి ఐకమత్యం ఉండాలని దేశీయులకు ఎంతో శ్రద్ధా భక్తులతో విన్నవించింది. దేశభక్తులను సౌమ్యులందరిని ఆకర్షించదగ్గ ఆదర్శములు ప్రకటించింది. ఆ ఆదర్శాలలో తీవ్ర కాంగ్రెసువాదిగాని, ముస్లిములీగువారుగాని, కిసాను సభవారుగాని కాదనదగ్గ అంశాలేమిలేవు. సంయుక్త రాజ్యాలకు దురదృష్టం ఎదుర్కొంటూవుంటే, తూర్పు యూరోపులో హిట్లరు విజృంభిస్తూవుంటే, పొరుగున జపానువారు తరుముక వస్తూవుండగా, భారతీయులకు ప్రమాదం నచ్చజెప్పవచ్చుననిదలచి, విజయం పొందుటకు ఐకమత్యం అవసరం గావున అందరిని ఒకటిగా చేర్చుటకై ప్రతి స్త్రీని పురుషుని, రాజుని రయితుని, నాయకుని నౌఖరుని, రాజకీయవేత్తను రచ్చపోయేవానిని వేడుకొంటిమి. కాని కాలం విపరీతంగానుంది. బ్రిటిషువానికి భారతీయునకు, భూస్వామికి రయితునకు మధ్య ద్వేషాలు అనుమానాలు పెరిగి శత్రు చర్యలవలనను, భయంవలనను వృద్ధిచెందుటచేత, జాతీయ యుద్ధరంగం ఉద్దేశములు యింకను నెరవేరలేదు.

తరువాత క్రిప్సుగారి రాయబారం విఫలమవడం జరిగింది. కాంగ్రెసు పార్టీ తాను సర్వాధికారం చెలాయించుటకు యిదేమంచి సమయమని యెంచి, దేశాన్ని విదేశీయు లాక్రమించి, శాంతి చెడగొట్టెదరను భీతేనా లేక వర్ధాలో అట్లు తీర్మానించెను. అదివరకు కొన్ని సంవత్సరాలనుండి, వివిధ జాతుల మతముల ప్రాతినిధ్యంగల ప్రజా సంస్థగ నెంచబడుచుండిన పెద్ద రాజకీయ సంస్థ, కొద్దిమంది నిర్లక్ష్యపు వ్యక్తుల స్వార్థంతోకూడిన సంస్థయని యిపుడు రుజువయింది.

ఇట్టి సందర్భంలో జాతీయ యుద్ధరంగం తన ఉనికిని సార్థకం చేసుకొనుటకు, కాంగ్రెసును పూర్తిగ ఎదిరించి, విభ్రమచెందిన ప్రజలకు ప్రధాన రాజకీయపక్షంయొక్క కుయుక్తులవలన కలిగే ప్రమాదం నచ్చజెప్పుటకన్న వేరేమి చేయగలదు. జాతీయ యుద్ధరంగం తన నిష్పాక్షికపు జాతీయాదర్శములకు అనుగుణ్యంగ ఉండుటకై, యీ ఏకపార్టీ ప్రతికూల వైఖరి తీసుకొనక తప్పిందికాదు.

కాంగ్రెసు వార్ధానుండి బొంబాయివరకు, బొంబాయి నిర్ణయంనుండి నేటి దౌర్జన్యాలు, తగులపెట్టడం, కాల్పులు మున్నగు చర్యలవరకు తెచ్చిన విషాదగాథ యిపుడు విపులంగా చెప్పనవసరంలేదు. అశాంతినుండి, విదేశాల దాడినుండి మన దేశాన్ని రక్షింపవలసిన పూచీ ఇండియా ప్రభుత్వంవారికి గలదు. దానిననుసరించి జాతీయ యుద్ధరంగం ప్రస్తుత వైఖరి నిర్ణయించబడినది.

ప్రజా ప్రతినిధులులేని విదేశ ప్రభుత్వం ఉన్నంతకాలం దేశంస్వాతంత్ర్యంకలిగియుండదని కాంగ్రెసు చెప్పు సిద్ధాంతం అసత్యమని ఎవ్వరూ అనరు. యుద్ధం ముగియగానే ప్రజా ప్రతినిధుల ప్రభుత్వమే స్థాపిస్థామని సర్ స్టాఫర్డు క్రిప్సుగారు వాగ్దానంచేసిరి. ఈ వాగ్దానమును బ్రిటిషు పార్లమెంటు ఆమోదంతో బ్రిటిషు ప్రభుత్వం

అనేకసార్లు దృఢపరచుచు ప్రపంచంఅంతా చాటింది. కాని యీలోగా దేశంలో ఏదో ప్రభుత్వం వుండాలికదా ? ఇపుడున్న గవర్నరు జనరలు సభ్యుల ప్రభుత్వం, ప్రస్తుత సందర్భంలో ఎంత ప్రజా ప్రాతినిధ్యం కలిగియుండాలో అంత కలిగియున్నది. వైస్రాయి సంఘ సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడినవారుకారు, నిజమే. కాని భారతీయులలో అన్నిజాతులు మతములవారితరఫున మాట్లాడగలచిన, పెద్ద మనుష్యులు అందులో వున్నారుగాన, ప్రజా ప్రాతినిధ్యంగలదనే చెప్పవచ్చును. ఈ సంఘానికి ఒకటే ఆదర్శం—యుద్ధం ముగిసేవరకు దేశాన్ని రక్షించి, తరువాత ఇండియాకు యిష్టం వచ్చిన ప్రభుత్వవిధానం, యితర జాతులలో కావలసిన హోదా నిర్ణయించుకోడంకొరకు విడచి పెట్టుటయే వారి యుద్దేశం. ప్రజాప్రతినిధి ప్రభుత్వం అంటే, ద్వేషంగాని అనుమానంగాని, దానిపై కుట్రగాని లేదు.

ఇందుకొరకే ప్రభుత్వంవారు తమ చేతిక్రింద నున్న సంస్థలన్నింటిద్వారా, జాతీయ యుద్ధరంగం ద్వారాకూడా ప్రజలందరి ఐకమత్యం సహకారములకొరకు విన్నవించుచున్నారు. గాంధి మున్నగు కాంగ్రెసు నాయకుల బుద్ధి మరల్చనంత వరకు దీని ప్రచారం విఫలమయినట్లే. కాంగ్రెసు సూచనలయెడ, శాసనోల్లంఘనంపట్ల ప్రజలందరిని విముఖులనుజేసి, పెద్దలందరిని కాంగ్రెసేతర సంస్థలన్నింటిని ప్రతికూలంగా చేయగల్గినంత వరకు విజయమొందెను. మిత్రమండలి దేశాల ప్రజలు ప్రభుత్వాలుగూడ కాంగ్రెసు వైఖరిని ఖండించినవి. కాని ప్రస్తుత సమయంలో ప్రచారం అంతగా మెచ్చుకోబడదు. కాని జనులు గుంపుగ దౌర్జన్య చర్యలకు గడంగుచున్నందున వాటిని అణచుటకు ప్రభుత్వంవారు చేసే చర్యలకు ప్రజల సహాయమును చేకూర్చవలసిన బాధ్యత జాతీయ యుద్ధరంగంపై గలదు. జాతీయ యుద్ధరంగం ఉద్దేశములగూర్చి ప్రభుత్వంవారే యిట్లు గొప్పగా ప్రకటించియున్నారు :—

(1) ప్రభుత్వంవారు కఠినచర్య తీసుకొనుట అనవసరమను వాదమును జా. యు. రంగంవారు ఖండింతురు. కాంగ్రెసు సంఘములు యింకను ఒకమూలు తమ సాధనసంపత్తి కార్యవిధానం గూర్చి యింకను చర్చించుచు రాయబారములు జరుపుచుండగనే, ప్రమాదకరమగు సమిష్టి శాసనోల్లంఘన కార్యములు యేర్పాటుచేయబడుచుండెనని తెల్పుటకు సాక్ష్యంగలదు. గాంధిగారు వైస్రాయిని చూచివచ్చేవరకు ప్రభుత్వంవారు వేచి యుండవలసినదని కొందరందురు. కాని యీలోగా కాంగ్రెసు యెట్టి చర్యలు చేయదను భరోసా యివ్వలేదు.

(2) కాంగ్రెసును రాజకీయపక్షంగా నుండకుండా అణచేయాలను ఉద్దేశం ప్రభుత్వానికివలెనే జాతీయ యుద్ధరంగానికిగూడ లేదు. కాని ఇండియా యుద్ధ కృషిని నిరోధించి, సంయుక్త రాజ్యాలకు నష్టం కలిగించు ఉద్యమమునకు గడంగిన సంస్థను వారు ఎదిరించక తప్పదు. కాంగ్రెసువారు స్వాతంత్ర్యం హృదయపూర్వకంగా కోరేవారయినను, న్యాయంగా స్థాపింపబడిన అధికారుల అధికారం కూలదీయుటకు ప్రయత్నించుటచేత, భారతదేశ రాజకీయాభివృద్ధికి నిరోధం కల్పిస్తున్నారని జా. యు. రంగంవారు నిజంగా నమ్ముచున్నారు.

(3) ప్రమాదకరమగు ఉద్యమమునకు ఎవరు బాధ్యులో, ఎవరు దాన్ని నడిపింప సిద్ధంగా నున్నారో వారిపైనే చర్య తీసుకొని, శిక్షాచర్యకన్న నిరోధచర్యకే గడంగుటను వారు ఆమోదించుచున్నారు.

(4) యుద్ధానంతరం ఇండియా ఎట్టి మినహాయింపులేక స్వాతంత్ర్యం బడయునని వారు నమ్ముచున్నారు. ఇండియా ప్రభుత్వంవారును, బ్రిటిషు ప్రభుత్వంవారుగూడ యీ విషయమున ప్రపంచమంతటి సాక్షిగ వాగ్దానం చేసియున్నారు. ఈ గొప్ప వాగ్దానం తప్పక చెల్లింపబడును.

జాతీయ యుద్ధరంగం నేడు యిటువంటి ఉద్దేశాలతో పనిచేయుచున్నది. అవి స్వచ్ఛమయినవి, ధర్మమైనవి, పూర్తిగ జాతీయమయినవగుటచే రాజకీయేతరములైన ఆదర్శములే ఐక్యసంధాయకములు కావున జాతీయ యుద్ధరంగమున చేరండి.

# "నేను జపానువారిని స్వయంగా ఎరుగుదును."

III

## వారి దేశంలో రాజకీయాలు, నీతులు, వైగరా.

[జపానులో ఉండివచ్చిన ఒక మహనీయుడు వ్రాసిన వ్యాసం.]

ఫ్రాంసు రాజకీయాలలో అతివడిగా కలిగే మార్పులు సామాన్యంగా అర్థంకావని అంటారు. జపానులో పార్టీ రాజకీయాలుగూడ అటువంటివే.

జపాను పాలకవర్గం ఎన్నిసారులు మారినా జపాను విదేశీయ విధానమమాత్రం ఏండ్ల తరబడి మారకుండానే యుంటుంది. నలభై ఏడేండ్ల క్రిందట మొదటి పెద్ద సైనిక విజయం బడసినప్పటినుండి జపాను సైనికులు నావికాదళంవారును రాజ్యాక్రమణ కలలు కంటున్నారు. అవి యిపుడు నిజమవతాయని వారు నమ్ముచున్నారు. ఈ కలలకే 1927 లో ప్రధాన మంత్రిగనున్న జనరలు తనకాగారు రూపంపోసేరు.

తనకా ప్రణాళికయనబడు వారి ప్రకటన చాల ప్రఖ్యాతమయిపోయినా అట్లాంటిది లేదనే బుకాయిస్తున్న జపానుప్రభుత్వం, యీయేడు టోకియో రేడియోలో "తనకా ప్రణాళికయందు సూచింపబడిన మన విధిలో ప్రథమభాగం పూర్తికానున్నది" అని చెప్పింది. ఈ ప్రణాళికను మించిన దురాశా పూరితమగు జాతీయ విధానం వేరొకటియుండదు. అందిట్లున్నది: "తూర్పు ఏషియాలో విభేదాలు తొలగించుటకు జపాను ఇనుము రక్తంమార్గం అనుసరించవలెను. . . ప్రపంచాన్ని ఆక్రమించుటకు జపాను ముందుగ యూరోపును,ఏషియాను ఆక్రమించాలి.యూరోపు, ఏషియాలను జయించుటకు ముందుగ చీనాను జయించాలి; చీనాను జయించుటకు ముందు జపాను మంచూరియా మంగోలియాలను ఆక్రమించాలి. పదేండ్లలో యీ కార్యమంతా జపాను ముగించ దలంచింది!"

1937 సంగరం వరకు జపాను చక్రవర్తికి వెనుక చాటుగానుండి "వారే" (ఎవరో తెలియని వింతవ్యక్తులు) జపాన్ను పరిపాలించుచుండిరి. చీనా యుద్ధం ప్రారంభమయినప్పటినుండి యీ యుద్ధప్రియుల అధికారం ఎక్కువయింది. నేడు ప్రభుత్వం అంటే సైనిక కూటం యొక్క నిరంకుశపాలనమే, ఈ కూటంలో వ్యక్తులు అప్పుడప్పుడు మారుతూవుంటారు. కాని వారి విధానం మారదు. టోకియో, యకుహామా, కోభి, నగసాకి నగరాలలో ప్రతి ఒకదానియందు జీవితం నరకంగా మారుస్తేనేగాని, యిపుడు చీనా మలయా, ఇండోనేషియా, ఫిలిప్పినో, ఇండోచీనా, దేశీయులు భారతీయులు పడుచున్న కష్టాలన్ని ఆ నగరాలవారుకూడ పడితేనేగాని, యుద్ధమంటే ఏమిటో జపానువారు కూడ స్వయంగా గుర్తిస్తేనేగాని, యీ విధానం మారదు. మర్యాదగల రాజ్యాలతోబాటు సరిసమానమగు స్థానం హోదా ప్రపంచంలో బడయుటకు, శాంతినికోరి న్యాయబద్ధంగా నీతివంతంగా సహనం ఓర్పుకలిగి యుండాలని జపాను అప్పుడుగాని గుర్తింపజాలదు. నేడు జపానులో అధికారంలోనున్న సైనిక నియంతలను ప్రజలు హర్షిస్తున్నారు గనుక, జపానువారికి గుణపారం బోధించాలి. గత ఐదేండ్లలో ప్రజాపీడనమునకు సేనా నాయకులెంత బాధ్యులో జపానులో సామాన్య ప్రజకూడ అంత బాధ్యులే,

జపాను దేశంలోజరిగే గత 21 వ సంవత్సరముల చర్యలే అచటి ప్రజా స్వభావమును వెల్లడి చేయును. బాగా ప్రకటింపబడిన అంశాలు కొన్ని యిచట పేర్కొందును, గత 20 సంగ లలో జపానులో ఔదార్యం కలిగియుండుట ఒక పాపంగా ఎంచబడుచున్నది. అటువంటి జపానులోగూడ కొందరు ఔదార్యవంతులు లేకపోలేదు. వారి గతేమయిందో చూడండి:

1921 లో ప్రధానమంత్రి హోరాగారు పట్టపగలు టోకియో నగరంలో హత్యచేయబడెను. ఆతడు వాషింగుటను నౌకాదళసంధి కుదుర్చుటకు ఎక్కువగ పాటుబడెను. అతని హంతకుడు సులభంగా వురిశిక్ష తప్పించుకొనెను.

1930 లో ప్రధానమంత్రి హమగుచిగారు, ఒక విద్యార్థి ప్రేల్చిన తుపాకిగుండ్లచే చనిపోయెను. తనకు ప్రధానిపై ద్వేషంలేదుకాని, ఆతడు లండను నౌకాదళ ఒడంబడికలో జపాను చేరుటకు కారకుడుగావున చావ నర్హుడుగ నెంచితినని ఆ విద్యార్థి కోర్టులో తెలిపెను. ఆ హంతకుడు జాతీయ వీరుడయ్యెను.



విక్టోరియసు అను యుద్ధ నౌకపై విడసియున్న ఫైటరు విమానాలు.

ఈ నౌక 23,000 టన్నుల బరువుగలది.

రెండేండ్ల తరువాత వృద్ధ ప్రధాని ఇనుకాయి గారు హత్యచేయబడిరి. అతడు కీ॥ శే॥ డా॥ సనుయటునేను (చీనా నాయకుడు)గారి మిత్రుడు; చీనా యడల సౌమ్యంగా ప్రవర్తించాలని కోరుటే అతని తప్పు.

1939 లో జపాను శాసన సభయగు డయటులో ఒక ముఖ్య సభ్యుడులేచి, చైనీయులను సహకారం చేయమని కోరుతున్నాంకదా, వారిని మృగాలవలె చూడక తోడి మానవులుగ చూస్తే మంచిదని సూచించెను. అతని ఉపన్యాసం పత్రికలలో ప్రకటింపబడకపోయినను, ప్రజలకది ఎట్లో తెలిసెను, ఒక రిక్షా కూలివాడు ఒక విద్యార్థి, ఒక బ్యాంకు గుమాస్తా వేరు వేరుగా అతన్ని కత్తితో పొడువ యత్నించిరి. చివరకు ఉన్నతాధికారులొకరు అతనికో సూచన చేసిరి, క్షమింపరాని నేరం చేసినందుకు ఒకటే విముక్తి మార్గం అతనికి సూచింపబడెను. అతడట్లు (హరికారి) చేసెను నేనాతని అంత్యక్రియలకు హాజరయితిని.

2

సంఘంలో అవినీతి.

రాజకీయ నీతి యింతఛండాలంగా నున్నపుడు సంఘంలో నీతి అంతకన్న అధ్వాన్నంగా నుండును. జపాను నివసించుటకు యోగ్యమయిన దేశమని—ఆరోగ్యంగాను, ఆధునిక సౌకర్యాలు, పరిశుభ్రత గూర్చి నేను తెలిపియుంటిని. అట్లా బయట బయట అంటకుండావుంటే నివాస యోగ్యమయినదే.

కొన్నేండ్లక్రిందట జపాను కుటుంబా చారాలను తెలుసుకొనుటకై నేనొక జపాను గృహస్తుని యింట డబ్బిచ్చు అతిథిగనుంటిని. అతన్ని నేను విదేశాలలో కూడ ఎరుగుదును. ఆ కుటుంబం డబ్బు కిబ్బంది పడుచున్నట్లు మొదటి నుండి గమనించితిని. ఒకనాడు నేను బయటకు పోవుచుండుగ యింట్లో ఏదో తంతు జరుగుట చూస్తిని. అదొక "ఆశీర్వాదపు తంతు" అని తరువాత నాకు యింటి యజమాని చెప్పెను.—ఇంట్లో ఆఖరు అమ్మాయి కుటుంబపు ఆర్థికస్థితి చక్కబరచుటకు "ఎర్ర

దీపాల జిల్లాకు " పోవనున్నది. అన్ని సరిగా వుంటే ఆమె ఆరు నెలలలో తిరిగివచ్చి తన కాలేజీ చదువు కొనసాగించును, కాని యీలోగా నాకు కావలసియుంటే స్వీకరిస్తే సంతోషిస్తారు —ఇట్లాంటి కథలు నేను జపానులోనున్నపుడు ఎన్నో విన్నాను.

ప్రపంచంలో ప్రతి పెద్ద నగరాలలో యిట్లాంటి 'ఎఱ్ఱ జిల్లాలు' (వ్యభిచారం) ఉంటాయిగాని, యెక్కడ జపానులో ఉన్నంత సిగ్గుమాలిన నీచత్వంతో బాహాటంగా వుంటాయనుకోను. దారిపోయే పురుషుడు ఎంచుకోడానికని, స్త్రీలు కిటికీలందు ప్రదర్శింపబడుదురు.

జానుగంతరుగారు "ఏషియాలో" అని వ్రాసిన గ్రంధంలో "జపాను వ్యభిచార గృహాలు ప్రపంచంలోకల్లా పెద్దవి. వేలకొలది యువతులు—పిన్న వయస్సు బాలికలుగూడ— తమ తలిదండ్రులచే ప్రతి యేడు వ్యభిచారంకై విక్రయించబడుదురు. గెషాయను వేశ్యమాత జపానులో సుప్రసిద్ధమయిన వ్యక్తి. వ్యభిచారానికి జపానులో న్యూనత లేదు. అదృష్టవంతురాలయినచో వ్యభిచార స్త్రీ కట్నానికి తగినంత డబ్బు గడించుకొని తన గ్రామానికి పోయి వివాహం చేసుకుంటుంది. త్రాగుడు, జూదం, సంగీతం జపాను వ్యభిచార గృహాలలో నిషేధింపబడినవి. అవి పనిలో సమర్థత తగ్గించేస్తాయి. వ్యభిచారం ఒక ఘనమయిన వ్యాపారం. దానివల్ల ప్రభుత్వానికి ఆదాయం కలదు".

మూడేండ్ల క్రిందట నిష్పాక్షికుడగు గ్రంధకర్త యీ వాక్యాలు వ్రాసెను. వేలకొలది యువతులు తలిదండ్రులచేత వ్యభిచారం కోసం ఏటేట విక్రయింపబడుదురట. ఈ యువతుల తండ్రులు సోదరులు యీ దేశంలో కాలు పెడితే, భారతీయ స్త్రీల మానం నిలుస్తుందా?

---

# విజయలక్ష్మీ వ్రతం.

యుద్ధం చెయ్యడం ఎందుకు? అని ప్రశ్న వేస్తే, మనము సరియైన జవాబు చెప్పగలిగి ఉండాలి. మనముచేసేపని ఎందుకు చేస్తున్నామో గ్రహించకుండా, గ్రుడ్డి యెద్దు చేనిలో పడినట్లుగా, పనిలేని మంగలి పిల్లి తలకు క్షౌరం చేసినట్లుగా, పుల్లయ్య వేమవరం వెళ్లివచ్చినట్లుగా, కొట్టేవా డెవడో కొట్టబడేది ఏదో కొట్టడం ఎందుకో తెలియకుండా, చీకట్లో చిందులు త్రొక్కినట్లుగా, ముసుగులో గ్రుద్దులాటవలె, ముందు వెనుకలు ఆలోచించకుండా, వెఱ్ఱి వీరావేశంతో గంగవెఱ్ఱు లెత్తినట్లుగా, స్థిరసంకల్పంలేకుండా, సంకల్ప ప్రయోజనం గ్రహించకుండా, సంకల్ప శుద్ధిలేకుండా ఏ పనిచేసినప్పటికీ, అది సార్థకం కాదు. సరిగదా, నిరర్ధకం, నిష్ప్రయోజనంకూడా అవుతుంది. కాబట్టి యిప్పుడు బ్రిటిష్‌వారున్నూ బ్రిటిష్‌వారితోచేరిన అమెరికా, రష్యా, చైనా మొదలైన మిత్రరాజ్యాలవారున్నూ దేనికొరకు యుద్ధం చేస్తున్నారు? ఈ యుద్ధ సంకల్ప ప్రయోజనం గ్రహించినట్లయితే, యీ యుద్ధ సంకల్పం శుద్ధమైనదిగా ఉన్నట్లయితే, విజయం తప్పక లభిస్తుంది. "యతో ధర్మ స్తతో జయః." ఎక్కడ ఎవరిపక్షమున ధర్మముకలదో, ఆ పక్షమునకే జయము లభించితీరవలెను. అది సృష్టి ధర్మము. అది భగవంతుని నిర్ణయం. యుద్ధమెందుకయ్యా చేస్తున్నారంటే, శాంతికోసం యుద్ధం చేస్తున్నారు. ప్రపంచ శాంతికొరకై యీ ప్రపంచ సంగ్రామం చేస్తున్నారు. అయితే, ఇందులో ఒక విచిత్ర రహస్య విశేషంవుంది. హిట్లరుకూడా యిదే పాట పాడుతున్నాడు. తాను కూడా లోకశాంతికోసమే యీ సంగ్రామం సాగిస్తున్నానని చాటిస్తున్నాడు, అందువల్ల మనకిప్పుడొక ధర్మసందేహం కలుగుతూవున్నది. హిట్లరుయొక్క సంకల్పం శుద్ధమైనదా? మిత్ర రాజ్యాలవారి సంకల్పం శుద్ధమైనదా? నిజంగా ప్రపంచశాంతికొరకున్నూ, లోకకల్యాణము కొరకున్నూ నిజంగా స్థిరసంకల్పులై ఉన్నవా రెవరు?

లోక శాంతిని ప్రతిష్ఠించవలెనంటే, ప్రజలందరూ శాంతి సౌఖ్యములతో వర్ధిల్లవలెనంటే, ముఖ్యంగా ఉండవలసినదేది? ప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు ఉండాలి. ఆత్మ స్వాతంత్ర్యంలేకపోతే, ఆత్మవికాసంగాని, ఆత్మశాంతిగాని కలుగదు. ప్రజాస్వాతంత్ర్యం కొరకు హిట్లరు నిజంగా పరితపిస్తున్నాడా? హిట్లరు తన జర్మనీ దేశంలోనైనా ప్రజాస్వాతంత్ర్యం వృద్ధిపొందించి

వికసించేటట్లుగా కృషిచేసినాడా? జర్మనీలోని ప్రజలకు తమ తమ అభిప్రాయాలు వెల్లడించుకొనేటందుకుకూడా అవకాశం లేకుండాచేసాడు. దేశంలో భిన్నభిన్న రాజకీయాభిప్రాయాలు కలవారు వేర్వేరు రాజకీయ పక్షములుగా వేర్వేరు పార్టీలుగా ఏర్పడి ఉంటారు. అటువంటి వేర్వేరు పార్టీల తరఫు ప్రతినిధులందరూ, శాసన సభలో సమావేశమై తమ అభిప్రాయాలను తమ రాజకీయ సిద్ధాంతములను వెల్లడించి, భిన్నాభిప్రాయములు కలవారు స్వేచ్ఛగా అనేక రాజకీయ వ్యవహారములను చర్చించి, చిట్టచివరకు వోట్లు లెక్కించిన పిమ్మట ఒక తీర్మానమునకు రావాలి. సభలో ఎక్కువమంది ఏ ప్రకారంగా నిర్ణయిస్తారో ఆ నిర్ణయమునకు మిగిలినవారుకూడా బద్ధులై దేశపరిపాలనా వ్యవహారములను నిర్వహిస్తూ ఉండాలి. అటువంటి ప్రజాభిప్రాయ ప్రకటనకు అవకాశ స్వాతంత్ర్యమును ఇచ్చినట్లయితే, అన్ని పక్షాలవారున్నూ కలిసి ఒక్కొక్క విషయమును నిర్భయంగా స్వేచ్ఛగా చర్చించి మధించినప్పుడు, ధర్మమేదో, అధర్మమేదో, స్పష్టంగా నిర్ధారణ అవుతుంది. సరియైన హేతువాదములవల్ల ధర్మ మార్గమును నిర్ణయించి, ధర్మమార్గమునే అనుసరించి దేశపరిపాలన సాగించుటకు సాధ్యమవుతుంది. "పదుగురాడుమాట పాడియై ధరజెల్లు." ప్రభుత్వాధికారులకు ప్రజల కోరికలుగాని ప్రజల కష్టనిష్ఠురములుగాని స్పష్టంగా

## మీరు జపానుభాష మాట్లాడుదురా ?

చాలమంది మాట్లాడుచున్నారు.
ఎవ్విధమైన శాంతి లేకుండ చేయుచు,
మార్కెటులందు ధరలు అకారణంగా హెచ్చు తగ్గులు అగునట్లు,
ప్రతి వ్యక్తికి కొంత అనవసరమగు నష్టము కలుగునట్లు,
ఘోరమైన పుకారులను పునశ్చరణ చేయుచున్నారు.
ఈ పుకారులు జపానునుండి వచ్చుచున్నవి.
వానిని లక్ష్యం చేయకండి.
వానిని వ్యాపింప జేయకండి.

* వదంతులను నమ్మకండి *

జపానును ఎదుర్కొనుటకు దేశీయ యుద్ధ రంగమును తయారుచేయండి.



తెలియగలవు. అప్పుడు "జనవాక్యంతు కర్తవ్యం" అన్నట్లుగా, జనవాక్యమునే అధికారులు తమ కర్తవ్యముగా శిరసావహించి వ్యవహారములను నిర్వహిస్తారు. అటువంటి ప్రజాస్వాతంత్ర్య పరిపాలనా పద్ధతి అమలులో ఉన్నప్పుడే, "స్వస్తిప్రజాభ్యః పరిపాలయన్తాం—న్యాయేన మార్గేణ మహీం మహీశాః—లోకాస్సమస్తాః సుఖినోభవంతు ॥" అని మన పెద్దలు చెప్పియున్నారు. ఆ విధంగా ప్రభువులైనవారు న్యాయమైన మార్గమును అనుసరించి ప్రజలను పరిపాలించినప్పుడు, సమస్తలోకమున్నూ సుఖమును శాంతిని పొందగలదన్నారు.

ఇటువంటి ప్రజాస్వాతంత్ర్య పద్ధతిని హిట్లరు తన జర్మనీదేశములో అమలుపరచినాడా ? లేదు. ముమ్మాటికీలేదు. తన దేశంలో తన అభిప్రాయమును ఆమోదించినటువంటి నాజీపార్టీ ఒక్కటే ఉండవలెనని నిర్ధారణచేసాడు. దేశంలో నాజీ పార్టీ తప్ప ఇంకో పార్టీ ఉండకూడదని నిర్ణయించి, యితర పార్టీల నన్నింటినీ అణచివేశాడు. తన నాజీ పార్టీకి తానే నాయకుడనని చాటించాడు. తన మాటప్రకారమే తన పార్టీ యావత్తూ నడుచుకోవలెనన్నాడు. తన మాటకు ఎదురు చెప్పిన వానిని జైలులో పెట్టించాడు. తన నాజీ పార్టీకి ప్రతికూలంగావుండే ఇతర పార్టీలవారి నందరిని

నిర్బంధ ప్రవాసములలో బంధించి అణగ త్రొక్కివేసినాడు. తన నాయకత్వానికి అడ్డు తగిలేవారినందరిని ఒక్కరాత్రిలో, తానే స్వయంగా తన రివాల్వరుతో కాల్చి చంపివేశాడు. జర్మనీ రాజ్యమంతా తన మాటకు అడుగు దాటకుండా, ఏకచక్రాధిపత్యంగా, నిరంకుశంగా తాను ఎట్లా తలుచుకుంటే అట్లా నడిపిస్తానని సర్వాధికార నియంతగా తయారైనాడు. నేను తప్ప ఇంకొకడు యీ జర్మనీరాజ్యంలో నాకంటె పూజింపదగినవాడు ఉండకూడదన్నాడు. పూర్వకాలంలో హిరణ్యాకశిపుడనే రాక్షసుడు కూడా యిదే విధంగా తన రాజ్యంలో శాసించాడు. " నన్నే భగవంతునిగా పూజించాలిగాని, యింకొకనిని పూజిస్తే శిక్షిస్తా " నన్నాడు. ఇటువంటి నిరంకుశత్వం నిరాఘాటంగా సాగినట్లయితే, లోకానికి శాంతి లభిస్తుందా ? బాగా ఆలోచించండి. ఇటువంటి నిరంకుశాధికార ప్రభుత్వం చలాయించడమే చాలా దివ్యమైన పద్ధతి అని, ఎవడైనా అంగీకరించగలడా ? కాని, జపాను వారున్నూ, ఇటలీ ప్రభుత్వాధికారియైన ముసులోనీ



*

అమెరికాలో తయారయిన

" ఎగిరేకోట "

ఈ యుద్ధవిమానాలు ఏడు మైళ్ల ఎత్తునకుగూడ ఎగిరి 3,000 మైళ్లవరకు ఏకాయకిని పోగలవు.

*

యున్నూ అంగీకరించారు. అందువల్లనే ఇటలీయున్నూ, జపానున్నూ జర్మనీతోచేరి ఒక కూటంగా ఏర్పడినాయి. దీనికే " అక్ష రాజ్యాల కూటం " అని హిట్లరు నామకరణంచేసాడు. " అక్ష " అనే సంస్కృత శబ్దానికి, " ఇరుసు " అని అర్థం. ఈ అక్ష రాజ్యాలకూటం, ప్రపంచానికి ఒక ఇరుసువంటిదట, యిరుసుయొక్క ఆధారంవల్ల బండి చక్రములు ఏ విధంగా తిరుగుచున్నవో, బండి ఏ విధంగా నడుస్తున్నదో అదే విధంగా యావత్తు ప్రపంచ చక్రమున్నూ యీ అక్ష రాజ్యాల యిరుసుమీద ఆధారపడి నడుస్తూ ఉండవలెనని హిట్లరు సంకల్పించి, ముందుగా యీ అక్షరాజ్యా లనే యిరుసును ఏర్పాటుచేసాడు.

హిట్లరు అహంకారపూరితుడు. అంతేకాదు. దురాశాపూరితుడు. దురాశ దుఃఖముచేటు, దురాశాపూరితుడై యితర రాజ్యాలమీదకు అక్రమంగా, నిష్కారణంగా దండెత్తినాడు.

ఆశకు అంతులేదు. దురాశకునీతి నియమంలేదు. నేడు వ్రాసికొన్న ఒడంబడిక పత్రమును, రేపు చింపివేస్తారు. నేడు చేసిన ప్రమాణం రేపు రద్దుచేస్తారు. దురాశాపూరితుడు నీతికి నిలువబడగలడా ? రష్యాతో హిట్లరు మూడేండ్ల

క్రిందట స్నేహభావంగా ఉంటానని మైత్రి పత్రం వ్రాసియిచ్చాడు. ఏడాది గడచిందో లేదో, తాను ప్రమాణపూర్తిగా వ్రాసియిచ్చిన పత్రాన్ని తానే కాలితోతన్నివేసి, నీతి నియమంలేకుండా, రష్యామీదకు కత్తికట్టి యుద్ధానికి వచ్చాడు. కనుక, ఇటువంటి అక్షరాజ్యాలవల్ల లోకానికి శాంతి సౌఖ్యములు లభింపగలవా ?

ఇటువంటి అంతర్జాతీయ నీతి నియమములను పాటించని పాతకులను సంహరించడానికే బ్రిటిష్ వారున్నూ మిత్ర రాజ్యాలవారున్నూ యుద్ధం చేస్తున్నారు. లోక శాంతికొరకున్నూ, లోక కల్యాణం కొరకున్నూ యుద్ధం చేయుచున్నటువంటి యీ మిత్ర రాజ్యాలతో ఏకీభవించడం మన కర్తవ్యం. పవిత్ర కర్మభూమిలో పుట్టిన భారతీయులందరూ, ధర్మ సంరక్షణార్థమై యుద్ధం చెయ్యడానికి మిత్ర రాజ్యాలకు చేయూతనిచ్చి తోడ్పడాలి. ఈ విధంగా లోక శాంతిని ప్రతిష్ఠించుటకొరకై మనము సంకల్ప శుద్ధితో విజయలక్ష్మీవ్రతం చెయ్యాలి. లోక శాంతిని ప్రతిష్ఠించడమనేది చాలా పవిత్రమైన కార్యం. మన పవిత్ర సంకల్పానికి ప్రతికూలంగా ఉన్న భూత పిశాచముల నన్నింటినీ పారదోలి వెళ్లగొట్టాలి. ఆ భూత పిశాచములను పారదోలుటకు ఉచ్చాటనమంత్రం ఆ సేతు హిమాచల పర్యంతం జపించాలి. ఈ ఉచ్చాటన మంత్రాన్ని "శ్రీ" కారంతో ప్రారంభించకుండా "ఛీ" కారంతోనే ప్రారంభించాలి. ఈ విజయలక్ష్మీ వ్రతం చేసేవారు పఠించదగిన దండకం ఇదిగో! సాంతంగా అచ్చువేయడానికి చోటులేదు. మచ్చుకు మాత్రం కావలెనంటే మొదటినుంచీ కొంతవరకు యీ దిగువను ముద్రిస్తున్నాము.

# దండకం.

## జయ్! మిత్రమండలికీ జై! జయ్! భారతమాతకీ జై!

"ఛీ! లోక సంహారకా! ఘోర రాకాసివై, జాతికిన్ వ్యక్తికిన్ స్వేచ్ఛ లేకుండగాజేసి, నాజీల పార్టీయటం చొక్క సంఘంబు గల్పించి యుద్ధానికిం బెద్ద నే నంచు నీజర్మనీరాజ్య సర్వాధిపత్యంబు జేబట్టి టాంకుల్ విమానంబు లెన్నెన్నొ నిర్మించి, గర్వాతిరేకంబునన్ మీసముల్ ద్రువ్వి, వర్సేల్సు గిర్సేల్సు పత్రంబు లెన్నన్ పవిత్రంబులే? ఇవ్వి లెక్కింతునే? ఈ ప్రమాణంబులున్ వట్టి తంత్రంబులే యంచు లక్ష్యంబు రవ్వంతయున్ లేక, పోలెండు హాలెండు నానొప్పు రాజ్యంబులన్ గూల్చి, రష్యామహారాజ్యమున్ బట్టగా దిట్టవై మైత్రిపత్రంబులం జింపి, సేనల్ వడిన్ బంపి, మర్దించెదన్ సామ్యవాదం బటం చొక్క వర్షంబుగా యుద్ధమున్ జేసి యూక్రేనులో జొచ్చి కాకేసియా కొండలం జేర రాకాసివై డాన్‌ప్రవాహమ్ము నీయోధరక్తప్రవాహమ్ముగా జేసి, వేవేగ నీవేగి బాకూను చేబట్టగా సాగి, "నా కడ్డ మెవ్వార లీరేడు లోకంబులం జూడ, భేదింతు ఛేదింతు బ్రహ్మాండఖాండంబులంగూడ, వేజీల్చి జెండాడగా నాంగ్లసామ్రాజ్యమున్ ఇండియారాజ్యమున్ సిద్ధమై యుద్ధసన్నద్ధమై వచ్చు నాజర్మనీసేన" లం చీవు బల్‌కారులన్ ప్రేలుచున్ బీరముల్ పల్కుచున్ రేడియో గర్జనల్ సేయుచున్ దోషమం చెంచ కాబాలగోపాల మల్లాడ నాకాశవీధిన్ విమానంబులన్ బంపి ఘోరాగ్ని గోళంబులన్ భూమిపై ద్రోయ నుల్లాసమా? నీకు కైలాసమా? లేక, కేళీవిలాసంబె? పాపాత్ముడా! దోషభూయిష్ఠుడా! నీచకర్మిష్ఠుడా! నీతియున్ జాతియున్ లేని నీచాతినీచుండ! నీజన్మ రాకాసి జన్మంబు; తిట్లున్నవే తిట్ట నిన్ హిట్లరా? నీదురంతంబు లెంచంగ నే నెంతవాడన్; జపాన్‌మంత్రు లున్నారహో మన్సులోనీ సదా మెచ్చు నీశక్తి........"

ఇట్లాగే, యీదండకం నడుస్తుంది.

విజయలక్ష్మిని సాధించవలెనంటే; శత్రువును సాధించాలి. శత్రువును సంహరించడానికి యీ దండకం చదివి నిలువబడితే, గుండె బెదురు ఉండదు. ఈ దండకం చదివినవాళ్లు ఉక్కుగుండులై, ఉద్దండులై, చండప్రచండులై, మొండి శిఖండులనైన, ఖండనమున బెండువలె రెండుగా చీల్చి చెండాడగలరు.

# పోలీసువారి కష్టాలు.

## (గౌ" న్యాయమూర్తి వాడ్సువర్తుగారు.)

గత కొద్దిరోజులలో కొందరు భారతీయుల బుర్రలను బుద్ధి ఖాళీచేసినందున, అరాచకంప్రబలి రైల్వే స్టేషన్లు తగులబడి పొగలు క్రమ్ముచున్నపుడు, విలువగల కాగితాలు డాక్యుమెంటులు కాలి భస్మమగుచున్నపుడు, నాకు పోలీసువారి కష్టాలగూర్చి జ్ఞాపకంవచ్చెను. కనిస్టేపు పని కష్టమయినదే.

సామాన్య పరిస్థితులందే, ఇండియను పోలీసు జమానుపని చాల కష్టంగానుండును, సాధారణంగా ప్రమాదాలకు లోనయియుండును. కొన్ని గంటలే ఆఫీసుకుపోయి కడుపులో చల్లకదలకుండా పనిచేసుకొనే బ్రతుకుకాదు పోలీసువారిది. భార్యాపిల్లలతో కలసి కులాసాగా ఒకవారం గడుపుకునే అవకాశం ఎన్నడోకాని పోలీసువానికి లభించదు. ఆవారంలోనైనా అరగంట నోటీసులో ఎంతోదూరం, ఏదో ఘోరవిషాదం జరిగిన చోటికి పోవసిద్ధంగా నుండవలెను. అలసి ఆకలితో ఆచోటాతను చేరేసరికి, తన అవసరాలు మరచిపోయి, ఏ గ్రామంలోనో శవంచుట్టు యీగలలాగ మూగిన అసత్యాలను భేధించి నిజంతెలుసు కొనుటకు ప్రయత్నించాలి. తాను చేసేదంతా మున్ముందు కోర్టులో ఏ తెలివైన వకీలు చేతనో క్రాసు పరీక్షకు విమర్శకు లోనవునను దిగులతనికి యుండును. ఏసాక్షి అబద్ధం చెప్పిన యితడే చెప్పించేడని, పక్షపాతం చూపుచున్నాడని, శ్రద్ధగ పనిచేయలేదనియు నిందింపబడును. కాని యీ పనులన్ని పోలీసువారికి ఎన్నడో సంభవించునవికాక సాధారణవిధులు. ఇటువంటి పనులకు, రాజకీయ అశాంతి ఆందోళన జతగూడినచో గుంపులకొలది ప్రజ అకస్మాతుగ ప్రజల ఆస్థి ప్రాణాలనాశనం చేయుటకు తలపెట్టినపుడు, వాటిని రక్షించుటకేయున్న పోలీసువారి జీవితం ఎట్లుండునో వేరే చెప్పాలా ?

మారుమూలవూరులో ఒక పోలీసు స్టేషను అధికారంలోనుండు సబు ఇన్‌స్పెక్టరుకి, సబు రిజిస్ట్రారు ఆఫీసును రౌడి గుంపు దోపిరి చేస్తున్నదని కబురొచ్చిందనుకోండి. ఈ గుంపులో అపరిచితులుండరు. మున్ముందు వారితోకలసి మెలసియుండవలసిన ఘరానామనుష్యుల కొడుకులుంటారు. కొందరు పెర్బడ్డ బద్మాషీలు త్రాగేసిన వారు లూటీకివస్తారు. కాని వారిలో ఎక్కువమంది యువకులు మర్యాదస్తులేయుంటారు. అందుచే అతడేమిచేసిన నిందలపాలగును. అంతాజరిగిపోయిన తరువాత రక్షింపబడిన కాగితాలు రికార్డుల గూర్చి స్థానిక ప్రజలాలోచించక, గాయాలు తగిలినవారి గురించి ఆలోచిస్తారు. అతడు ఎట్టి కఠినచర్యా తీసుకొనక సంకోచించినచో, ఉద్యోగంలో మాటవచ్చును. ఫలితం గూర్చి ఆలోచించుటకు వ్యవధియుండదు. ప్రమాదమయిన కఠినచర్య చేయకపీలులేదు. అది అతని డ్యూటీ. వీలయినంతమంది జమానులను, ఆయుధాలను త్వరలో ప్రోగుచేస్తాడు. అరడజనుమంది దొరికితే మహాగొప్ప. మిగిలినవారు గ్రామాలపై సమన్లు జారీచేయుటకో కేడీలను పరిశీలించుటకో పోతారు, కొందరు స్టేషను కాపలాకు ఉండిపోవాలి. వేళ్లపై లెక్కపెట్టగలచినంతమంది జమానులతో అతడు, వందలకొలది ఉద్రేకపూరితులైన ప్రజాగుంపు నెదుర్కొనుటకు పోతాడు.

పోలీసు రాగానే రాళ్లు, ఇటికలు, సోడా బుడ్లు పడతాయి కొందరు జమానులకు దెబ్బలు తగులుతాయి. మొగంపై రాయితో దెబ్బతగిలినపుడు శాంతంగా నుండడం ఎంత కష్టంగానుండునో అటువంటి అనుభవంగల వారికే తెలుస్తుంది ; కాని శాంతంగా నుండకతప్పదు. అటువంటప్పుడు సబు ఇన్‌స్పెక్టరు ఏమి చేస్తాడు ? తెగించి లాటీచార్జి చేయవచ్చు, కాని తనవారు కొద్దిమందే యగుటచే, జనులగుంపు చెదరిపోకుండా ఎదురు తిరిగినచో మహాప్రమాదమగును. అతడు వెనక్కిపోయి, పోలీసుదళం అధికంగావచ్చువరకు వేచియుండవచ్చును. కాని యీలోగా రికార్డులు తగులపెట్టేస్తారు, బహుశా గుమస్తాలు హత్యచేయబడతారు చాలా నష్టం కలుగుతుంది, లేదా అతడు తుపాకులు కాల్చవచ్చును. అదే భద్రమయినపని. ఘోరాలు చేయవచ్చిన గుంపు ఆపనిమాని తమ ప్రాణాలు రక్షించుకోడం కోసం

గుండు ప్రేలగానే పరుగెత్తుతారు. దొమ్మి జరుగుచుండగ క్షణంలో, ఎవరితో ఆలోచించుటకైనా వ్యవధిలేక సబు ఇన్‌స్పెక్టరు యీ విషయం నిర్ణయించుకోవాలి. అది చాల పెద్ద బాధ్యత, అత్యల్పమగు దౌర్జన్యం ఉపయోగించి, తొందర పడకుండా శాంతంగానుండి దొమ్మినణచి శాంతి కాపాడిన పోలీసు ఉద్యోగులు ఎంత ప్రశంసకేనా తగుదురు.

శాంతి చేకూరిన పిదప, వాలు కుర్చీలలో కూచోని విమర్శించే పెద్ద లనేకులుందురు, పోలీసు ఉద్యోగి ఏమిచేసినా తప్పే అంటారు. లాటీ చార్జీ చేస్తే తుపాకులు కాల్చవలసిందంటారు, తుపాకులు కాలుస్తే తొందరపడ్డాడు లాటీలు సరిపోయియుండు నంటారు, లేదా విరమించి క్రొత్త పోలీసు దళం వచ్చేవరకు వేచియుండాల్సిందంటారు, ఇటువంటి విమర్శ సద్బుద్ధితో చేసేది కాదు, పోలీసు ఉద్యోగి ఎవ్వడూ కోపోద్రేకంతోనున్న గుంపును చెదరగొట్టడం సంతోషమయిన కార్యంగా చేయడు, విధిలేక డ్యూటీగా చేస్తాడు, అట్లాచేయడం మన సౌఖ్యం కొరకే. గత రెండువారాలలో ప్రమాదపరిస్థితుల నెదుర్కొని, ధైర్యంతో ధీమాతో కఠినంగా అణచివేసిన పోలీసు ఉద్యోగులందరు ప్రశంసకు కృతజ్ఞతకు పాత్రులు. ప్రమాద సమయమున గాభరాలో పొరబాటులు చేసిన కొద్దిమంది ఉద్యోగులు మన సానుభూతికి అర్హులు. మొత్తంపై పోలీసు దళమంతయు కొనియాడ తగియున్నది. గత కొద్దివారాలలో వారు తమ ప్రమాదకరమగు అయిష్టమగు విద్యుక్తమును భక్తితో శ్రద్ధతో ఓర్పుతో నిర్వహించిరి. కావున సత్పురుషులెల్లరు పోలీసువారికి చేయెత్తి నమస్కరించి ప్రశంసించక మానరు.

## ఇండ్లలో రక్షణ గదులు.

సుమారు 12 మందిగల సామాన్యపు యింట్లో విమానదాడి సమయమున రక్షించుకొనే మంచి మార్గం ఏదని అనేకమంది తెలియగోరుచున్నారు.

అటువంటి చిన్న యింట్లోనున్నవారు దాగొనుటకు రెండు మార్గాలుగలవు. 1. ఇంటికి తగిలిగాని దూరంగాగాని మంచి రక్షణ గుహకట్టించుకోవచ్చును. 2. లేదా ఇంట్లోనే ఒకగది ఎంచి "రక్షణగది" గా మార్చుకోవచ్చును.

మొదటి పద్ధతి ఖర్చుతోకూడిన వ్యవహారమున్నూ, ఇంటి వెలుపల జాగాయుండాలి కనుక, అందరు అనుసరింపలేరు. "రక్షణగది" బాగా భద్రపరచుకుంటే, తోటలో గుహవలెనే రక్షణయొసంగగలదు. పెక్కుండ్రు గృహస్థులు అదే అనుసరింతురు. ప్రమాద సమయంలో ఎవరి యింట్లోవారు ఉండగోరెదరు. ఇండ్లలో వుంటే రాత్రి భద్రంగా నిద్రపోవచ్చును, పగలు గూడ దాడి జరిగినచో యిల్లే మంచి రక్షణగ నుండగలదు.

గదిని బాగా ఎంచి అవసరమగు మార్పులు చేస్తే, తగిన రక్షణ యొసంగగలదు. అది ఎట్లా మార్చాలో ఎ.ఆర్.పి. పుస్తకం నె 6 రులో వివరంగా తెలుపబడియున్నది. అది రూ 2 లు ఖరీదు, ఇండియా ప్రభుత్వం సివిలు డిఫెన్సు డిపార్టుమెంటువారు ప్రచురించిరి. ఈ రాష్ట్రంలో హిగిను బాదంసు కంపెనీ, స్వదేశమిత్రను విక్రయశాలలందన్నిటియందు దొరకును.

---

# ఇండియానుగూర్చి శత్రు రేడియో ప్రచారం.

## అసత్యాలు — అపభ్రంశాలు.

గత కొద్దిరోజులలో శత్రురాజ్యాల రేడియోలు ఇండియాలోని వ్యవహారములగూర్చి తప్పుడు ప్రచారం విపరీతంగా సాగిస్తున్నాయి. శాసనోల్లంఘనంగురించి యిచట ప్రభుత్వంవారు గైకొన్న నిరోధచర్యలు అతివడిగా జరిపినందున వారికి ఆశ్చర్యంగా వున్నట్లుంది. ఉదాహరణకు :

ఆగస్టు 7 వ తేదీన టోకియో రేడియోలో యిట్లు చెప్పబడెను :—

"ప్రపంచదృష్టిఅంతా యిపుడు అ. భా. కాంగ్రెసు సంఘంపై యున్నది. బ్రిటిషు ప్రభుత్వంవారు ఎట్టి చర్య గైకొందురన్నదే సందేహం. కాంగ్రెసు తీర్మానం అందినతరువాత వారంరోజులేనా పడు

తుంది బ్రిటిషు ప్రభుత్వంవారు నిర్ణయించుకోడానికి ”

ఇట్లా ఊహించుటచేతనే అక్షరాజ్యాల అసత్య ప్రచారము కొన్నిరోజులు వెనకపెట్టిరి. కాంగ్రెసు తీర్మానంగావించినపిమ్మట తిరిగి ఇండియాను గూర్చిన ప్రచారము విజృంభింపజేసేరు. బొంబాయిలో అ. భా. కాంగ్రెసు సంఘసభ జరుగుటకు కొద్దిరోజులు ముందువరకు అధికారులకు కాంగ్రెసుకి రాజీ రాయబారాలు జరుగుతాయోమోనను అనుమానంతో ఇండియా ఎట్టి షరతులపైని రాజీ పడరాదని అక్షరాజ్యాలు ప్రచారం చేయుచుండేవి.

ఇండియాలో పోటీపడుచున్న వివిధ రాజకీయపక్షములుగాని, యీ పార్టీలు ప్రభుత్వంగాని రాజీపడరాదనియే శత్రుదేశాల ప్రచారంలో ప్రధమోద్దేశం. ఇండియా రక్షణకు అన్నిపార్టీలు ఏకమయి సిద్ధమగుచున్నాయను వార్తలు జపానుకి జర్మనీకి అందినవెంటనే ఇండియాపై దాడి చేస్తామని బెర్లిను-టోకియో రేడియోలు బెదిరిస్తూ వుంటాయి. ఇండియా రక్షణ యేర్పాటులను నిరోధించుట శత్రువులయొక్క రెండో ఉద్దేశము. అందుకనే ఇండియా యుద్ధప్రయత్నాలకు ఆటంకం కలిగించాలని బ్రిటిషు సైన్యాలు అమెరికను సైన్యాలు ఇండియా రక్షణకు చేయుచున్న కృషిని దౌర్జన్యంతో నిరోధించాలని స్పష్టంగా విన్నవిస్తూ వుంటారు.

## దేశాయి మరణం.

ఢిల్లీనుండి రేడియోలో ప్రసారంచేయబడు వార్తలను శత్రువులు ఎంత విపరీతంగా మార్చి తప్పుడుప్రచారం చేయుదురో, మహాదేవదేశాయిగారి మరణంపై వారి విమర్శవలన తెలియగలదు. ఇండియాకు అనేకవేల మైళ్ల దూరంలో నుండు అక్షరాజ్యాల ప్రభుత్వములు వార్తలకై ఢిల్లీ రేడియోపైనే ఆధారపడవలెను. కనుక ఆ ఢిల్లీవార్తలే విని అపభ్రంశంగా తమ ఉద్దేశాలకు అనుగుణ్యాంగా విమర్శించి చెప్పిరి. మహాదేవ దేశాయిగారిని విషంపెట్టి చంపేరని బెర్లిను రేడియో రెండు రోజులు అబద్ధాలు చెప్పింది. హిట్లరు అధికారానికి వచ్చినప్పటినుండి రాజకీయ హత్యలకు పేర్వడింది కనుక జర్మనీకి యిట్టి ప్రచారం చేయడం సులభమే. ఈ విచిత్రకధను టోకియో ఎత్తుకుంది ; తరువాత రెండుదేశాల రేడియోలు వినుగొచ్చినంత తరచుగా వర్ణించినవి. కాని కీ॥ శే॥ దేశాయిగారు హిందూ ఆచారముల ప్రకారం గాంధిగారి సమక్షమునందే దహనం చేయబడిరన్న విషయం అక్షరాజ్యాల రేడియోలు చెప్పవు. ఇండియానుండి సాక్ష్యం బెర్లినుగాని టోకియోకిగాని చేరకముందే దేశాయి విషంపెట్టి చంపబడెనను కథ దురుద్దేశంతో ప్రచారం చేయబడింది. ఈ అసత్యమును డా॥ హెచ్. సి. మెంకలు, ఎం.డి. గారు, సుప్రసిద్ధులగు అమెరికను వైద్యులు తీవ్రముగ ఖండించిరి. వారు పత్రికలలో యిట్లు ప్రకటించిరి :—

“మహాదేవ దేశాయిగారు నాయకులలో పిన్నవయస్కులగుటచేతను, ఎన్నడు గుండె జబ్బుతోగాని శిరోభారంతోగాని బాధపడని ఆరోగ్యవంతు డగుట చేతను వారు ఆకస్మాతుగ మరణించుట యితరుల పాపకర్మచే జరిగియుండునని శత్రువులు నిందించుచున్నారని తెలిసింది. చాల జోస్తీగల మిత్రునిగను, నాచే చికిత్సనొందిన రోగిగను నేను కొన్నేండ్లనుండి మహాదేవ దేశాయిగారిని ఎరుగుదును. .... . ఆకస్మాతుగా ఏదో జబ్బొచ్చియే తాను చనిపోవుదునని వారు గత కొద్దేండ్లలో ఎన్నిసార్లో అన్నారు. వారు చనిపోవునట్టి సందర్భము ప్రభుత్వంవారు ప్రకటించిన వివరములు వారి నెరింగిన మిత్రులకుగాని వైద్యులకుగాని తెలిసినవిషయములకు విరుద్ధంగా లేవు.”

ఢిల్లీనుండి, లండనునుండి యిటువంటి వార్తలు విని తిప్పి తప్పుగా చెప్పజాలనపుడు యిటువంటి అసత్యాలు అక్షరాజ్యాల ప్రచారకులు సృష్టిస్తారు. ఇపుడు ఇండియాకు యిటువంటివార్తలు ఎక్కువ పంపుతున్నారంటే అసత్యాల సృష్టి చాల బాహుళ్యంగా జరుగుచున్నదన్నమాట. బెర్లిను, టోకియో నగరాల అధికారుల ఉత్తరువులప్రకారం యీ ప్రచారం జరుగుచుండును. ఇండియాను గూర్చి అసత్య ప్రచారానికి సైగాను రేడియో ప్రాపీణ్యతగాంచింది. ఆగస్టు 4 వ తేదీన సైగాను రేడియో జపాను ప్రచారసూత్రాలకు విపులవ్యాఖ్యానం కోరుచు టోకియోకు ఒక సందేశం పంపింది. బల్గేరియా ముఖ్యపట్నమగు సోఫియానుండి షాంగైలోని ఒక పత్రికకు 1942 వ సం॥ జూన్ 27 వ తేదిన పంపబడిన సందేశం దారికొట్టబడి సంగ్రహించబడినది. అందులో యిట్లు గలదు :—

“ఇండియా వార్తలు ఉచితంగా షాంగైలోని జర్మను వార్తాసంస్థయగు డి. ఎన్. బి నుండి రాగలవు. అది మీ పత్రికలో పూర్తిగ ప్రచు

రించడం మానవద్దు. క్లింఫ్‌గారికి (షాంగైలో డి.ఎక్స్.బి. యజమాని) దానిగూర్చి ఉత్తరువులు బెర్లినులోని డి.ఎక్స్.బి. నుండి వచ్చును. అతనితో సంప్రదించండి.—ఎనోమోటోలియకాఫ్. ”

అక్షరాజ్యాల రేడియోలలో వెలువడు అతి ఘోరమయిన అసత్యాలు కొన్ని ఇండియాకు అతిదూరంగానున్న షాంగై, లిస్బను, స్టాకుహోము నగరాలలో ఉద్భవించినట్లు చెప్పబడుచుండును. నిజమగు వార్తలు ఎక్కువ రూఢియైనవి శత్రువుకన్న ఢిల్లీ రేడియోకే అందగలవు. ప్రతిరాత్రి శత్రువులు ఘోరమయిన కల్పిత వార్తలు ప్రచారంచేస్తున్నారు. ఉదాహరణకు: ఇండియాలో ప్రజల ఆందోళన అణచుటకు ఇండియాప్రభుత్వంవారు బాంబులువేయుట, విషక్రిములను వెదజల్లుట చేయుచున్నారని చెప్పుచున్నారు. శత్రువుకి నిజం తెలియదని, దురుద్దేశం కలదని, ఇండియాకొరకు వారు చేయుచున్న రేడియో ప్రచారం ఎంతమాత్రం నమ్మదగినదికాదని వేరే రుజువుచేయనక్కరలేదు.

## విమానాలనుండి టార్పెడోలు.



విమానాలనుండి దిగువ సముద్రములో ప్రయాణంచేయు శత్రు నౌకలపై టార్పెడోను వేయుట యీ యుద్ధంలో పరిపాటయింది. బ్యూఫర్టు విమానంలోనికి ఒక టార్పెడోను సంధించుట యిందు కానవగును.

# మూడేండ్ల యుద్ధం.

## రెండు కాదు, 12 యుద్ధరంగాలు.

సాగించిన కార్యకము.

సుప్రసిద్ధ ఆంగ్ల వ్యాసకర్త ఫిలిసు బెంట్లీ గారు యిట్లు వ్రాయుచున్నారు:—

యుద్ధం యిదివరకు వేతనాలు పుచ్చుకున్న సిపాయిలచే జరిపింపబడుచుండేది. ఇపుడు దేశ ప్రజలందరు ఏదోవిధంగా పాల్గొనవలసిన మహోద్యమ యుద్ధంగా మారినది.

1939 సెప్టెంబరు 3 వ తేదిన మనం యుద్ధంలో దిగితిమి. మనపై శత్రువు దాడిచేయలేదు. మనం (ఇంగ్లీషువారు) యుద్ధంలో చేరకుంటే హిట్లరు చాల లాభాలు చూపించేవాడనిగూడ సూచన లుండెను. అయినను యుద్ధంచేయుట మనవిధిగా నెంచి యుద్ధంలో దిగితిమి. హిట్లరు

తమపై రాకపోయినా హిట్లరుపై యుద్ధం ప్రకటించిన మొదటి రాజ్యం బ్రిటిషు ప్రభుత్వమే.

నౌకాదళం.

నౌకాదళం అట్లాంటికు, పశిఫికు, మధ్యధరా, ఉత్తర ఆర్కిటికు, పెర్షియను, అరబికు, హిందూ మహా సముద్రములందు యుద్ధం చేయుచున్నది. 45,000,000 బ్రిటిషు ప్రజలకు పోవు ఆహార పదార్థముల నౌకలను నౌకాదళంవారు కాపలాగా పోవుచున్నారు. ఇటలీవారి సముద్రాలలోనుండే మాల్టాదీవికి ఆహారము ఆయుధాలు గొంపోవుచున్నారు ; ఆఫ్రికాను చుట్టి మధ్యప్రాచ్యమునకు సైన్యాలను పంపుచున్నారు ; అట్లాంటికు సముద్రం దాటి కనడా దేశంనుండి అమెరికానుండి ఇంగ్లాండుకు సరకు తెచ్చుచున్నారు ; మందుగుండు, విమానాలు, టాంకులు, ఫిరంగులు, రైల్వే ఇంజనులు, వాగన్లు, వస్త్రాలు, జోళ్లు అన్ని మంచు సముద్రాలుదాటి ఉత్తరదిక్కునుండి రష్యాకు అందజేయుచున్నారు.

ఈ వ్యాసం మీరు చదువుచున్న యీక్షణంలో 600 బ్రిటిషు యుద్ధనౌకలు, సముద్రాలపైనున్నవి. 1941 జూను వరకు అక్షరాజ్యాల నౌకాలు 6,250,000 టన్నులపైన ముంచబడుటో, కుంటువడుటో, రాయలు నౌకాదళంచే పట్టుబడుటో జరిగెను. అక్షరాజ్యాల జలాంతర్గాములు, మందుగనులు విమానాలు చుట్టు మూగియున్న యీ కాలంలో నౌకాయానం సులభమయింది కాదు.

12 వ యుద్ధరంగం.

ఇంగ్లాండులో చేర్చుకొనబడిన నేల సైన్యం యీలోగా ఏమిచేసింది ? రెండోవైపు యుద్ధరంగం తెరువమని అందరు కోరుచున్నారు. అది రెండో రంగంకాదు, 12 వ యుద్ధరంగం అంటే సమంజసంగా నుంటుంది. మన సైన్యానికి సామ్రాజ్య దేశాల సైన్యాలనుండి చాల మంచి సహాయం వచ్చింది.

రాయలు విమానదళంవారి సహాయంగూర్చి ఎవ్వరికి సందేహం వుండదు. తరంగాలవలె వచ్చు శత్రు బాంబరు విమానాలను వారు తరిమివేసిరి. తిరిగి అవి ఇంగ్లాండుపై రావచ్చును. కాని జర్మనీపై మన విమానాలు పోయినట్లుగా వేయేశి ఒక్కమారుగా ఎన్నడు శత్రు విమానాలు రాజాలవు. హాంబర్గుపై 35 నిముసాలలో మనవారు 175,000 మంటల బాంబులు వేయుట అంద రెరింగినదే. 1942 జూలై ఆఖరుసరికి రాయలు విమానాలు శత్రు దేశంపై 7,892 దాడులు జరిపినవి.

ఉత్పత్తి రంగం.

1942 జూను మాసంలో ఇంగ్లాండునందు ఇతరదేశా లన్నింటిలోకన్న యెక్కువవడిగా మందుగుండు ఆయుధాలు తయారయినవి. ఆ నెలలో సాలీనా 25,000,000 రౌండ్ల పెద్ద ఫిరంగులకు, 2,000,000,000 రౌండ్ల చొప్పున చిన్న తుపాకులకు మందుగుండు తయారు చేయబడెను. రెండు గంటలకో విమానం చొప్పున చాల ఫ్యాక్టరీలు నేడు విమానాలు తయారు చేస్తున్నాయి. తక్కువ మనుష్య శక్తితో ఎక్కువ ఆయుధ ఉత్పత్తి జరుగుచున్నది.

కర్మాగారాలలో ఎక్కువ గంటలు పనిచేయుచున్నారు. గత మూడేండ్లాయి యిట్లు జరుగుచున్నది. ప్రజలు పన్నులుగూడ ఎక్కువ చెల్లించుచున్నారు. సాలీనా 500 పౌనుల రాబడి గలవాడు 150 పౌనులు పన్నుక్రింద చెల్లిస్తున్నాడు. అంతటితో సరిపోదు, టీ, సారాయి, సిగరెట్లు, అన్ని వస్తువులపై అదనం పన్ను గలదు. అదివరకు అవసరాలుగ నెంచబడిన కొన్ని వస్తువులు యిపుడు భోగాలక్రింద విడచిపెట్టవలసి వస్తున్నది. స్త్రీల టోపీలపై అసలు ధరకన్న 2/3 వంతు పన్ను చెల్లింపవలసివస్తున్నది.

ఆహార పదార్థములు కొలతగ యిచ్చుచున్నారు. ఎక్కువ గంటలు పనిచేయుటేగాక, మిగిలినకాలం ఏ.ఆర్.పి. పనులు హోముగార్డు మున్నగు పనులు చేయుచున్నారు. ఇంతచేసియు ప్రజలు అలసటచూపరు. "ఈ యుద్ధరంగాలు చాలు పండ్రెండోది అక్కరలేద "నరు. ఇంకో యుద్ధరంగం తెరువమని ప్రజలు కోరుచున్నారు. బస్సులో ప్రయాణంచేస్తే, ఎంత వేగం యీ యూరోపులు రెండో యుద్ధరంగం తెరువబడుతుందా యని చర్చలు వినబడుతూ వుంటాయి. ప్రజలంత యెక్కువ పని చేయాలని ఉత్సాహంగా నున్నారు.

ప్రథమశ్రేణి సైనికులు విజయం పొందుటకు ఎవరు కారకులు ? నౌకా సైనిక నావికదళము



జర్మనీ, కబడ్దార్ !

బలవత్తరమగు బ్రిటిషు ఇన్ఫెంట్రీ టాంకులు. వాలంటేను 3 రకం టాంకు ఫిరంగు లివి.

అందు ప్రపంచం అన్నిమూలల యుద్ధంచేస్తున్న వారెవ్వరు ? స్త్రీల సేవాదళములందు చేరుచున్నవా రెవ్వరు ? బాంబులు పడి మంటలు మండుతూ వుంటే, వాటిని ఆర్పి, పడినవారిని రక్షించి, మరు నాడు ఏమి యెరగనట్లు మామూలు పనులకు పోవుచున్నవా రెవ్వరు ? 6,000,000 ఎకరము లను గత మూడేండ్లలో అధికంగా సాగుచేసింది ఎవరు ?

సామాన్య ప్రజలే.

ఇంగ్లాండులోని సామాన్యప్రజలే. అందరు వారే. పిన్నలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు 14 నుండి 65 సం॥ల వయస్సుగలవారిలో ప్రతి ముగ్గురిలో యిద్దరు తమ కాలమంతా యుద్ధ కార్యములందే వినియోగించుచున్నారు. తక్కిన మూడోవంతువారు కొంతకాలం యుద్ధకార్యాల కును, ప్రజల జీవితాని కవసరమగు యితర సామాన్య కార్యములందు వినియోగింతురు.

ఇపుడు పురోగమన యుద్ధం.

యుద్ధం ప్రారంభమయి మూడో వార్షికోత్స వం నేడు జరుగుచున్నది. రెండున్నర సంవత్స రములు మనం ఆత్మరక్షణ యుద్ధమే చేసితిమి. శాంతిప్రియులమగు మనం తయారుకాకముందే శత్రువు పైబడుటచే ముందు దెబ్బకాచుకొనే యుద్ధమే చేయవలసివచ్చింది. అదేనా చేయ గల్గుటే గొప్ప విశేషం.

కాని యిప్పుడు స్థితి మారింది. మన కిపుడు మిత్రులు చేరేరు. కష్టకాలం ఒంటరికాలం గడచి పోయింది. ఉత్పత్తి సమస్య ప్రతిబంధకం దాటేం. చెడ్డకాలంలోగూడ నవ్వుతూనేవున్నాం. నేడూ నవ్వుతున్నాం ; కాని నేటి నవ్వు వేరువిధ మయినది. ఇపుడు మనం తిరుగుదెబ్బ కొట్ట గల్గుచున్నాం. దెబ్బ పుచ్చుకోడంకన్న యిచ్చు టకు విమానదాడులు జరుపుతున్నాం.

ఇపుడు మనం తిరుగుబాటులు సలుపుచున్నా ము. ఇక యుద్ధంలో గెలువనున్నాం. శాంతి సాధించగలం. తరువాత న్యాయం, ధర్మం, సభ్యత స్వాతంత్ర్యములపై నాధారపడు నూతన ప్రపంచమును సృష్టించగలం. ఆ ప్లానులన్ని సిద్ధంగ నున్నాయి. సంయుక్తరాజ్యాలు సగ ర్వంగా ముందుకు పోతున్నాయి. ఇకముందు మనమే కథ నడుపుతాం. భావి విజయానికి ఆత్మార్పణం చేస్తున్నాం.

4

# కాయగూరలు ఎక్కువ పండించండి.

ఆహారపదార్థముల విషయమున స్వయం సమృద్ధిగా నుండవలసిన అవసరం యుద్ధంవలన మన చెన్నరాష్ట్రమునకు యిపుడు కలిగింది. ఇచటి ప్రజలకు ముఖ్యమయిన ఆహారపదార్థము బియ్యం కావున బియ్యంపంట యితర ధాన్యాల పంటలుగూడ వృద్ధిచేయుటకు ప్రభుత్వంవారు తగు శ్రద్ధ వహించుచున్నారు.

వరిధాన్యం, కాయధాన్యాలు ప్రధానములు. అయినా భోజనంలో కలియవలసిన యితర పదార్థములు కొన్ని గలవు. అవి తగినంత కలియకున్నచో ఆరోగ్యం సరిగ నుండదు. ఆరోగ్యంయిచ్చే యితర ఆహారపదార్థములలో కాయగూరలు పండ్లు ముఖ్యమయినవి. వాటిని ఎక్కువగా పండించి, ప్రజలు యిప్పటికన్న యెక్కువగా భుజించవలెను. సామాన్యంగా దొరకు ఆకు కూరలలో విటమినులు ఎక్కువగనుండును. అవి కాబేజి బచ్చలి యెంత యోగ్యమయినవో అంత యోగ్యమయినవే. దుంపకూరలు, ఉర్లగడ్డలు, తెల్ల ఎఱ్ర శిరిగడదుంపలు, కారట్సున్నా పప్పులు కాయధాన్యాలు యిచ్చునంత బలము నిచ్చును. వంకాయలు, పొట్లకాయలు, బెండకాయలు మున్నగు సాధారణంగా దొరకు కాయగూరలుగూడ చాల విటమినులు కలిగియుండును. ఫలములందు సి విటమిను గలదు. బొప్పాయి పండు, మామిడిపండ్లు, టొమాటో పండ్లలో ఎ విటమిను ఎక్కువగ నుండును. కావున కాయగూరలు పండ్లు ఎక్కువగ పండించినచో రెండు ప్రయోజనములుండును: ప్రజల ఆరోగ్యము బాగుపడును, పైగా పప్పుధాన్యముల వాడుక తగ్గించును. ఇంగ్లాండులో యుద్ధసమయములందు ఖాళీస్థలము లన్నింటియందు కాయగూరలు పండించుటవలన దేశంలో ఆహారం వృద్ధియైనది. కాయగూరలు ఆకుకూరలుగూడ ఎక్కువ పండించుట చాల అవసరమైన కార్యంగా యెంచవలెను.

గ్రామములందు పట్నములందుగూడ యీ రాష్ట్రంలో కాయగూరలు, పండ్లు పండించుటకు అవకాశం యెక్కువగలదు. గ్రామాలలోను చేరువను వుండు ఖాళీస్థలములందు ప్రతియింటి పెరటిలోను కాయగూరలు పండించవచ్చును. నీటి సదుపాయమున్నచో యిండ్లకు దూరంగానుండు పడియా స్థలములలోకూడ తోటలువేయవచ్చును.



*

ఇంగ్లాండులో శిక్షణపొందుచున్న భారతీయ యుద్ధ పరిశ్రమల కార్మికులు. ఇండియా నుండి అనేక జట్లు యువకులు పోయి ఇంగ్లాండులో శిక్షణ పొంది వచ్చుచున్నారు. అచట వారి బసలో కారంసు ఆడుకొనుచుండగ తీసిన పటము.

*

పెద్దబంగాళాలుగలవారు తమ యావరణలయందే కాయగూరలు పండించుకోవలెను. హాస్టల్సు, భోజనవసతిగల యితర సంస్థలు తమకు కావలసిన కాయగూరలు స్వంతంగా పండించుకోవాలి.

తమ స్వంత ఉపయోగానికేగాక, యితరులకు విక్రయించుటకుగూడ సరిపోవునంత కాయగూరలు ప్రజలు పండించుటకు తగిన ప్రోత్సాహం చేయవలసినదిగా రివెన్యూ వ్యవసాయశాఖలవారు కోరబడిరి. ఈ శాఖలవారు తగు ప్రచారంచేసి అదివరకు పడియాగా వదలిపెట్టబడిన జాగాలందు త్వరగా పండే బప్పాయి, అరటి, దోస పండ్లను పండించునట్లు ప్రోత్సాహించుచున్నారు, వ్యవసాయశాఖ కార్యాలయములందు విత్తులు మొక్కలు లభించును. పాఠశాల తోటలకు విత్తులు ఉచితంగా వ్యవసాయ డిపోలవారు యిత్తురు. ప్రభుత్వమందిరాలలో అద్దెకుండు ఉద్యోగులు వేరే శిస్తులేకుండానే తమ బంగాళా యావరణయందు దున్నించి ఆహారపదార్థములు పండించ అనుమతించబడిరి. అన్నామలెలందు, నీలగిరిలందు యిందుకొరకై ప్రత్యేక సౌకర్యము లొసంగబడినవి. బంజరులు తాత్కాలికంగా వినియోగించుకొని సాగుచేయుట కనుమతించబడెను. ఫెర్టిలైజర్లు, వ్యవసాయపరికరాలను, పశువులను కొనుటకు, నీలగిరులందు సీమ కాయగూరల పంట వృద్ధిచేయుట కవసరమగు పనులకు స్వల్ప షరతులపై ఋణములిచ్చుటకై ఆలోచించుచున్నారు. నీలగిరులందు, మదనపల్లి, పుంగనూరు మున్నగు మైసూరు సంస్థాన సరిహద్దులందున్న తాలూకాలందును సీమ కాయగూరలు పండించుటకు కొందరు రయితులకు విత్తులు ఉచితంగా యివ్వబడును. ఇంకా యెక్కువ సౌకర్యములగూర్చి ఆలోచించుచున్నారు.

ఇండియాలో కాయగూరల పంటలు ఎక్కువ చేయాలని కొన్నియేండ్లనుండి ఆహారశాస్త్రి నిపుణులు ఘోషించుచుండిరి. వాటి వ్యవసాయం యిపుడు వృద్ధిచేయుటవలన యితర ఆహార ధాన్యములపంట యెక్కువజేయుటవలనగూడ యిపుడు దేశానికి ఎంతో మేలు కలుగగలదు.

# కాశీ క్షేత్రం.



## ముద్దుపేర్లు మార్చబడును-

జపానువారు సింగపూరును స్వాధీనం చేసుకొన్న వెంటనే ఆ నగరమునకు జపానీ పేరు పెట్టినారు. జపానువారు మన పట్టణములను, పవిత్ర స్థలములను వశపరచుకొనడం తటస్థించినట్లయిన వీటికిగూడ ఇదే విధంగా జరుగుతుంది. మత సాంప్రదాయమువల్లను చారిత్రాత్మకంగాను పేరుగాంచిన పట్టణములన్నియు పాడుచేయుటే గాక జపానీ పేర్లను పెట్టి వాటినే వాడాలని శాసిస్తారు. భారతీయుల అభిప్రాయములను లెక్కచేయరు.

ఈ దేశమునకు చెందిన మన మందరము ఎట్టి పోరాటము లేకుండ అట్టి అనాదరణకు ఒప్పుకుంటామా? కూడదు. సమిష్టి ప్రతిఘటనచేసి ఈ రాక్షసులను ఎదుర్కొందము.

జపానువారి నెదుర్కొనుటకై
దేశీయ యుద్ధ రంగమును
తయారుచేయుడు.






MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS